

శ్రీరస్తు.

శ్రీరామచంద్ర సద్గురుపరబ్రహ్మణేనమః.

శ్రీశారదాంబాయైనమః.

శ్రీ

# కాశీమహాత్మ్య పరమార్థ చింతన

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే॥

శ్లో॥ యస్యామిదం కల్పితమింద్రజాలం। చరాచరం భాతిమనోవిలాసం। సచ్చిత్సు[illegible] [illegible]హాత్మరూపం। సా కాశికాహం నిజబోధరూప॥

పంచేషుకోశేషు విరాజమానా। బుద్ధిర్భవానీ ప్రతిదేహగేహే। సాక్షీశివ సర్వగతాంతరాత్మ। సా కాశికాహం నిజ బోధరూప॥

కాశ్యాంహి కాశితే కాశి కాశీసర్వప్రకాశికా। సా కాశీ విదితా యేన, తేన ప్రాప్తాహి కాశికా॥

కులంపవిత్రం జననీకృతార్థా। విశ్వంభరా పుణ్యవతీచ తేన। అపారసంవిత్సుఖసాగరేస్మిన్, లీనంపరే బ్రహ్మణియస్య చేతః॥

శ్రీరామావిశ్వేశ్వర । నారాయణవాసుదేవ । నామ్నా వళిసా । కారనిరాకారంబో౦ । కారమని నమస్కరింతు గగుణిం చునర్థ ॥

హరిమాధవపురుషోత్తమ । కరివరదుడవాసుదేవ ఘన నరసింహా । పరమాత్మకృష్ణరామా । పరమేశ్వరవిష్ణుశౌరి పరుడ వనంతా ॥ 2

విఘ్నములుజెందకుండగ । విఘ్నేశ్వరపాదపద్మ విలసితభక్తి౯ । విఘ్నేశనాదుకృతిని । ర్విఘ్నముగా నొప్ప జేయు వినతశరణ్యా ॥ 3

యోగులహృదయములందున । బాగొప్పగసచ్చిదాత్మ పరమానందా । యోగీశాయనుచున్నను । రాగుసు మానసంబు జేయ రామపదంబా ॥ 4

రామ నిరంజననిర్మల । ధామ పరాత్పరుడవనుచు దల చెదనెపుడు౯ । ధామము[illegible]సాక్షును । రామా వేదాంత వేద్య రమ్యచరిత్రా ॥ 5

ఇనచంద్రవహ్ని తేజము । లనయంబును నీవునివ్వ నమరుచువారు౯ । ఘనముగప్రకాశులయ్యెరి । వనజేక్షణనీదుశక్తి వరభువనంబుల్ ॥ 6

సృష్టికిబ్రహ్మయునగా - విష్ణువుయనపాలనంబు వివరము జేయు౯ - నష్టమునకు రుద్రుడన౯ - స్పష్టము పరమాత్మనీవె సర్వమునొకడా ॥ 7

గురుడేబ్రహ్మయువిష్ణుదు - గురుడేరుద్రుండటంచు గురుసేవనము - స్ఫురణమొనర్పదనీవు౯ । గురుమతిచే నేను సర్వగురుడవనంతా ॥ 8

గురుభక్తిగలుగువానికి - హరిభక్తియుగలుగునపుడు
హరికృపచేతఁ - పరమార్థచింతగలుగును- పరమాత్మునిన్ను
దెలియు పరమపదంబౌ॥ 9

గురుమంత్రజపముచేతను - పరమేశ్వరభక్తినాకు వన
రగలిగెఁ - పరమాత్మ రామనీకృప - పరమగు సంపదయు శిరి
యు వరదాగలిగెఁ॥ 10

శ్రీకరమౌశిరిసంపద - నాకున్నిచ్చితివి నీవు నయముగ
బ్రోవఁ - నీకరుణ నేను నిప్పుడు - శ్రీకాశిలో నుంటినయ్య
సీతారామా॥ 11

వరదాకొండలరాయుడు - బరయగ దేహంబునిఁదయు న
దినేగాకఁ - వరుసగ నింద్రియసమితిని - నరయంగా దెలియు
ప్రత్యగాత్ముడనౌటఁ॥ 12

ఇల్లాలు లేదు నాకును - మెల్లనగాబోవవలయు మిక్కిలి
కష్టం - బిల్లును పిల్లలతోపష్టి జెల్లపు సంసారమందు జిక్కు
లుగలుగుఁ॥ 13

దేహంబస్థిరమారయ - గేహాదులు గ్రాహతతులు ఖేద
జనకముల్ - ఐహికమోహములవియును - శ్రీహరిపాదంబుగొ
లువ శ్రేయస్కరమౌ॥ 14

గంగాదిస్నానముశ్రీ - రంగాది తిరుపతి కాశి రామేశ్వ
రముల్ । శృంగారయాత్రలను చే - యంగా దుష్కర్మభవము
హరియించునసిఁ॥ 15

భక్తియువైరాగ్యంబౌ - సక్తిగ సాధనలు నాల్గు సద్గు
రుసేవల్ - యుక్తము వేదాంతశ్రవణ - ముక్తికిమార్గము ల
టంచు బుధులన వింటిఁ॥ 16

పోవును దేహం బెప్పటికో - పోవలె నరి తీర్థయాత్రఁ బో
యిన భవముల్ - పోవునటంచును నిశ్చల - భావము బరమా
త్మునందు బరపుచు నేనున్ ॥ 17

ఆసేతుహరిద్వారము - వాసిగ యీనడుమనుండు వర
తీర్థములన్ - నోశివ నే సేవించితి - కాశినివాసంబు నిపుడు
కలిగెన్ సాంబా ॥ 18

పరమాత్మ నిన్ను బొగడుచు - వరకాశిమహాత్మ్యమిపుడు
వనరగ వ్రాయన్ - పరతత్త్వబుద్ధి నొసవి - పరమేశ్వర చిత్తగింపు
వరదా వ్రాతన్ ॥ 19

మూఢుఁడ మూర్ఖుఁడ పాపుఁడ - గాఢముగా నిన్ను నుడువ
నగల నే నేనున్ - జాడియు దెల్పుము వ్రాయుట - వాడయు న
డిపించువాని నరో శ్రీకృష్ణా ॥ 20

విశ్వేశుని పూర్ధవుని - నిశ్వగుణుండైన దుండిసిద్ధయా
ధిపునిన్ - శశ్వన్నతి పైరవునిన్ - శాశ్వతుడా రామమూర్తిన్
శాశ్వత కాశిన్ ॥ 21

గంగయును పుష్కరిణిగుహా - మంగళకర తీర్థ లలిత
మణికర్ణికయున్ - లింగము కేదారీశ్వరు - సంగతిత త్రిలోచ
నుండు సంతత సేవ్యుల్ ॥ 22

లింగమయాలయములునక - లాంగ సుపర్వాంగనాళి
కాధారంబై - గంగానది జాహ్నవియున్ - మంగళకరమైన
విష్ణు మందిరములున్ ॥ 23

లెక్కకశక్యంబైనల్ - దిక్కులదేవాలయములు దీరదు
జూడన్ - జక్కగను చక్రతీర్థము - నక్కువ జూటితిని కొ
న్ని మందిరములనున్ ॥ 24

ఎక్కడజూచినలెక్కకు - మిక్కటమై జనులునంత మే
డనిసిండఁగ - పిక్కటిల గుడికిత్రోవలు - జిక్కక మమ్ముకవను
చంద్రశేఖరుగుడికిఁ ॥ 25

పక్కమలనోదుగుచుబోయిన - గ్రక్కున దర్శనముగాదు
గడుకష్టముగుఁ - పిక్కటిల జనులుపోడువగ - కక్కసమునబో
యి నీశు ఘను జూడనగుఁ ॥ 26

విశ్వేశ్వరుడనులింగము - విశ్వేశ్వరసీవెయగును విశ్వ
మునీవా - విశ్వపతిపి మృత్యుంజయ - విశ్వాత్ముడకృత్తివాస
వేడెద మెప్పుడుఁ ॥ 27

శ్రీవిశ్వనాథనీపద - శేవనమేపురుషుడెపుడు జేయునత
నికిఁ - గావింపనెట్టిబాధలు - శ్రీనైభోగములనిచ్చు సిద్ధము
భువిలోఁ ॥ 28

కేదారేశ్వరుజూచియు - సాదరమున మ్రొక్కులిడుచు
సంపదలియవే - నిదగు దయానే స్థిరియును - గాదన కిమ్మనుచు
జనులు ఘనముగ వేడఁ ॥ 29

అమ్మా యన్నము వస్త్రము - లిమ్మా మాకెపుడునంచు
నేర్పడజనులా - యమ్మయగు నన్నపూర్ణను - నమ్మతముగ బా
గడుచుంద్రు సర్వజనంబుల్ ॥ 30

నాదేవి విశాలాక్షికి - సాదరమున మ్రొక్కులిడుచు స
కలజనంబుల్ - బాధలు లేకను నెప్పుడు - భూధనములు నిమ్ము
యనుచు బాగ వేడువారుఁ ॥ 31

గంగాభాగీరథిదా - శృంగారము జెప్పవశమె శివమతు
లంతా - గంగనుజూచుచు మ్రొక్కుచు - గంగానది స్తోత్రముల
చె గానములమరుఁ ॥ 32

అరువదినాలుగుఘట్టము - లొరుసగ స్నానాదులందు
లోపలముఖ్యం - బరయగ నామణికర్ణిక - గురిగా స్నానంబు
జేయుగోరుచు జనులుర్ ॥ 33

స్నానముజేసెడివారును - మానసమున జపముజేయు
మహనీయులునుర్ - గానముజేసెడివారును - వానప్రస్థులును
గూడి యొకరితోనొకరుర్ ॥ 34

అధ్యాత్మకథలుజెప్పుచు - మధ్యాహ్నముదనుక వారు
మంత్రజపములర్ - దధ్యాసజేయుచుండగ - నాధ్యాసము తెర
గు జెప్పుమని యెడివారుర్ ॥ 35

అరువదినాలుగువిద్యలు - వరుసగ నభ్యాసమొప్ప వా
లాయంబుర్ - వరవిద్యార్థులు శాలల - గురుమతులై చదువు
చుండి గొప్పగునానర్ ॥ 36

కన్నతలి యన్నపూర్ణయు - మన్ననగా యన్నమిడగ
మరిజనులంతర్ - ఎన్నోదేశములారలు - తిన్నని యన్నమును
దినుచు తిరముగనుండర్ ॥ 37

అరువదినాలుగుసత్రము - లరయగ నన్నంబు పూర్ణ
మదియునుగాకర్ - పరజనులు యాత్రకొచ్చియు - పరమార్థు
లు నివ్వ నంత పరులుభుజింపర్ ॥ 38

ఆమహితాత్ముడు శంభుడు - శ్రీమాహేశ్వరికి జెప్పె శ్రీ
రామపదాం - బామోదకరంబగునని - రామా శ్రీరామ
రామ రామాయనుచుర్ ॥ 39

కూరలుగాయలునమ్ముచు - శిరమున మూటలువహించి
శివ రామహరీ - బరమాత్మకృష్ణవరదుడ - హరశంభు మహేశ
యనియెడువారుర్ ॥ 40

ఎప్పుడు కాశిలో నంతట - మెప్పుగ గీర్తనలు పాట మితిలేకుండా - దప్పక భాగీరథిలో- నొప్పుగభగవచ్చరిత్ర లో దలమీరఁగ॥ 41

శివధన్యకాశిమహిమఁగ - భువి కైలాసంబెగాక భూరి సుఖదమౌ - నవిరళభక్తి పురస్సర - నివసతి ఇహాకోర్కెలెల్ల నెగడించుదగఁగ॥ 42

కాశిలోమరణంబైనను - కాశీపతి ముక్తినొసగు కదు కృపననుచుఁగ - ఈశివభూపాళినిపర - దేశస్థజనుల్ వసింప దెల్యకతమునఁగ॥ 43

నేనిపుడు కాశివాసము - మానక జేసితిని ముక్తిమార్గమునిదియౌ - నీనామమెపుడుదలచెద - శ్రీనాథుడ ముక్తి నాకు శీఘ్రముగాఁగ॥ 44

నాకోర్కెనివినెు నియ్యామ - నీకును పూజలను జేతు నెప్పుడుమదిలో - జేకొని చిం[?]న జేతును - జీకాకును లేకయుండ జేయుము రామా॥ 45

ఆశ్రయము నాత్మబుద్ధికి - నాశ్రయమైయుండుబుద్ధి నది మనసునకుఁగ - నాశ్రయము మనసునింద్రియ - మాశ్రయమై విషయసమితి మరగున్నెపుడుఁగ॥ 46

మనసింద్రియవిషయంబుల - మననంబునుమరిగ నేని మరి బంధమగుఁగ - మనసున భగవచ్చింతన - ఘనముగ దాజేసె నేని గనుముక్తిపథం॥ 47

బనివెలిసి నేనుఇప్పుడు - మనసునుబోనీక నెపుడు మననమునిన్నే - ఘనముగ జేయుచునుంటి - న్ననుమానము లేక రామ యఖిలాత్మవనిఁగ॥ 48

భాషింపను ప్రాకృతులతో - భాషింపను వైకృతాత్మ భగవద్భక్తిన్ - భాషించెడిభక్తులతో - భాషింపుము నన్ను నిపుడు బురుషోత్తముడా॥ 49

అన్నము పరులదిదిన నే-నెన్నడు పరద్రవ్యమును గొనకెప్పుడు మదిలో - నిన్నే దలచుచునుందును - మన్ననగా నన్ను బ్రోవు మధుసూదనుడా॥ 50

ఈషణలుమూడు విడచితి - భాషింపుము నిన్నె నిపుడు బరమాత్మవనిన్ - బోషింపుము నన్ను నినుపి - శేషముగా బాగడనేర శ్రీపతిశౌరీ॥ 51

వాసనలుమూటివిడచితి - నేసంసారమున భ్రాంతి నిశ్శేషముగా - నాసయు దేహమునందున - చేసెడిఖత్మలఫలంబు జేర్చితి బ్రహ్మన్॥ 52

ధరణిని సహింపయు బ్రహ్మ - చరణమును పరిగ్రహంబు సత్యమునాకున్ - పరమా స్వేయని స్మిని - పరమేశ్వరసిద్దుగుణిత భక్తులనియు వే॥ 53

ఓకారుణ్యాదయానిధి - శ్రీకాంతుడ త్రివిధభక్తి శ్రేయస్కరమా - ఏకాంతభక్తి ముఖ్యము - నాకాభక్తియును నిమ్ము నారాయణుడా॥ 54

సాధనలునాల్గుదెలసితి - సాధించెద ముక్తినింక సర్వాత్మహరీ. గాదనకయివ్వ వేగృప - శ్రీదైతుడ సచ్చిదాత్మ సీతారామా॥ 55

శ్రవణము మననముదెలసితి - శివదని దిధ్యాసగతియు శేవ్యంబదియున్ - సవినయముగ గృపనొసగుము - శివశంకర వామదేవ శేవకుడనియున్॥ 56

వైరాగ్యంబు త్రివిధం - బరయంగా మందతీవ్ర మతితీవ్ర మనిర్ - బరువడితీవ్రమునిచ్చితి - వరదుడ సర్వాంతరాత్మ బాగుగ నాకుర్ ॥ 57

కామము క్రోధము లోభము - నామూలమును గలిగియుండ నరకంబసియుర్ - ఏమరకవిషువనౌనని - నామది నవి విడచితివుడు నరహరిశౌరీ॥ 58

నారముయన విజ్ఞానము - నారము నీకయనముగుట నారాయణుడౌ - నరయుగ విజ్ఞానంబును - శ్రీరమణుడ నాకునిమ్ము శీఘ్రముగాగర్ ॥ 59

ప్రజ్ఞానంబునునియ్యుము - ప్రజ్ఞానేంద్రియము విషయము లెవ్వని చేతర్ - సుజ్ఞానదృష్టిగనునో - ప్రజ్ఞానంబదియ నేను బరమునసంతా॥ 60

మనసునకు నేదిసాక్షియొ - మూనకనదియుయుమటంచు మంచిగనాకుర్ - శ్రీనాథదెలి[illegible]జ్ఞేయుము - నీనామస్మరణపూజ నేర్పుగజేతుర్ ॥ 61

ఇదినాదియహంకారము - యిదినాదేహమునటంచు నేదియెరుంగర్ - నదియే నేన్నాత్మయనుచు - విదితంబుగ నాకుదెల్పు విష్ణుమహేశా॥ 62

ఆస్తంబ బ్రహ్మవరకున - విస్తరితంబెద్ది యదియు విమల బ్రహ్మం - బాస్తితియు నాకునిలుపుము - నీస్తుతియును పాదపూజ - నెప్పుడు జేతుర్ ॥ 63

వరభగవద్గీతాదుల - నరణియు నేజూచినవియు సత్యమటంచుర్ - నరహరినడచుచునుంటిని - పరమేశ్వర ముక్తి నాకు వరమివ్వదగుర్ ॥ 64

పన్నగశయనుడ నెప్పుడు - నిన్ను నుపాసింప ముక్తి నిజ
ముగనిత్తుగ - నన్న వచనంబు సత్యము - మన్ననగా నిన్ను దల
తు మరువకనియవే॥ 65

హరి నీనామస్తుతిచే - దురితంబులుకడకుబోయె దుఃఖ
ములన్నిగ - పరిహృతములయ్యె కృపచే - కరివరదుడ ముక్తి
కొరకు కాశిలోనుంటిగ॥ 66

ఏకాంత మేకభుక్తము - ఈకాశిలో నేనుజేసి ఈశ్వర ని
న్నుగ - జీకాకులేకదలతును - సాకారముసీవె సర్వసాక్షివినీవే॥

అనుమానమేమిలేకను - మనసునుబోనీక రామ మనన
ముజేయగ - ఘనమైన స్వప్నమందున - వినబడెనే రూపులేక
వినదగునంచుగ॥ 68

ఉండుము కాశిలో మంచిగ - నుండగ భానుండుదీచి నుచి
తపతుమునగ - దండిబ్యాదసియందున - మెండుగ ముక్తియును
గలుగు మేలొసిగుగ॥ 69

ఇట్టుగస్వప్నంబాయెను - జుట్టము రాముడవునీవ జో
ద్యమునాకుగ - గట్టిగముక్తియుజెప్పితి - మట్టముగా మాఖ
మానమందుననియవే॥ 70

ఇప్పుడు స్వప్నమునిజమని - నొప్పుగ నమ్ముటకు వశమ
నోహోరామా - యెప్పుడునీదానామము - తప్పక మననంబు
జేయదగు బుద్ధియవే॥ 71

ఓయయ్య వాసుదేవుడ - నేయనుమానమును లేక నీనా
మము చే - నాయూన మేమిలేకను - జేయుము నిక ఘటవిముక్తి
జెందగనాకుగ॥ 72

ఓ-ఈశనీస్వశక్తియె - నా యీప్రకృతియను నామమది
యు ద్వివిధం - బై యీమాయయవిద్యల - నాయీశ్వర జీవు
లరయ నగు ప్రతిబింబుల్॥ 73

ఇలదర్పణమున ముఖముల్ - బలరగ బ్రతిబింబమయ్యు
బరగినపగిదిన్ - గలరట్టి ఈశ జీవుల - దెలసిన నాభాసుతాను
ధీరతబుద్ధిన్॥ 74

ఇలదర్పణముల్ దీసిన - నలరిన ప్రతిముఖము లేదు నటుల
నవిద్యన్ - దెలిసియు కడకున్ ద్రోసిన - గలుగున జీవుండు లే
డు గలడాత్మొకడా॥ 75

ఇట్టుగ దెల్పిరిబుధుల్ - గట్టిగ నామనసు నిందు గలయు
టచేతన్ - చుట్టాలగృహముపిడిచితి - బట్టితి వైరాగ్యమిపుడు
బరమాత్మగృపన్। 76

గురువులబోధలువింటిని - గురువులకును గురుడవీవ గో
విందహరీ - గురువును తల్లియు దండ్రియు - గురుతుగ నీవేనటం
చు గొలచెద నెపుడున్॥ 77

గజరాజు మకరిచేతను - గజిబిజియై నిన్నుదలువ గను
గొనియపుడుం - విజయంబగు చక్రముచే - గజరిపు బరిమా
ర్చి కరిని గాచితివిహరీ॥ 78

ఉత్తానపాదపుత్రుడు - పిత్రునితో నలిగినపుడు ప్రియము
గనిన్నున్ - చిత్తములోదలువనతనికి - సత్తుగ ధృవపదముని
నిచ్చి సాదనశౌరీ॥ 79

భక్తులునౌ ప్రహ్లాదుడు - రుక్మాంగద భీష్మ డార్జును శుక
బలియున్ - ముక్తులునయ్యిరిగావున - భక్తులలో నన్ను జేర్చి
పాలింపుహరీ॥ 80

పగగొనుచు జామదగ్నియు - తగనట్టియు కోపమునను
దగపైరాగా - తగదనిజెప్పకనప్పుడు - భగవత్తేజంబుగొనియు
మన్నించితివా॥ 81

నీపాదరజముచేతను - పాపములన్నియును బాసి పావన
మయ్యెగ - పాపియగు నహల్యయుగడు - పావనగు నన్ను గ
రుణబాలింపుహరీ॥ 82

పగవానితమ్ముడయ్యును - పగగొనక విభీషణుండు భక్తి
చెరాగా - ఖగవాహ రాజ్యమిచ్చితి - తగునయ్యా నన్ను బ్రో
వ - దయచే రామా॥ 83

దాక్షిణ్యముచే జటాయుకు - మోక్షంబిచ్చితివటంచు
మురియుచునేనుగ - ఏక్షణము నిన్ను మరువను - మోక్షం బి
వ్వంగదగును మురహరినాకుగ॥ 84

ఒక్కటియు వలువవిడువగ - దిక్కెవ్వరులేక కృష్ణ ది
క్కగుమనిరగ - గ్రక్కున ద్రౌపదికప్పుడు - మక్కువవస్త్రంబు
లియవె మహిమచె కృష్ణా॥ 85

కలయుముహూర్తము క్షణముగ - గలకాలము నిన్ను
దలువ గరుణించితివా - నలినాక్షయహర్నిశములు - వలనొప్ప
గ దలచుచుంటి - బరమాత్మహరీ॥ 86

ఒక్కడవయ్యును నెప్పుడు - పెక్కగు నవతారములను
ప్రియముగనెత్తగ - జిక్కుదువునిన్నుదలచిన - జక్కనిభక్తుల
లకునెవుడు జగదాత్ముడవై॥ 87

మత్స్యావతారశ్రీహరి - జచ్చరసోమకునిద్రుంచి జేకొ
ని యవుడుగ - దెచ్చియును వేదసమితిని - మెచ్చికచేబ్రహ్మకియ
వె మహిమదలిర్పగ 88

అమరులకై గిరిమోసియు - విమలంబగు నమృతంబు వి
బుధులకీయవే - కమలాక్ష కూర్మమయ్యును - కమలాసనుభవు
డు బొగడ ఘనమోహినివై॥ 89

అసురుడగు హిరణ్యాక్షుడు _ వసుధను గొనిపోవ వాని
వధియించియు నా _ వసుధను దెచ్చియు నిల్పవె - యసహాయ
వరాహమూర్తి యచ్యుతశౌరీ॥ 90

వరపుత్రుడనకనప్పుడు - పరబాధల తండ్రిబెట్ట వరనఖ
ములచే- నరహరి హిరణ్యకసిపుని - బరిమార్చియు భక్తునవు
డు బాలించితివా॥ 91

బలిచక్రవర్తినడిగియు - నిలగొని వృద్ధశ్రవునకు నిచ్చి
యు నవుడు - బలిని రసాతలమునకు - వలనొప్పగ బనిచితౌ
ర వామనమూర్తి॥ 92

ధరకు భారమునగుట - పరశునుగొని పరశురామ
వసుధాధిపుల _ మరి కార్తవీర్యు నప్పుడు - బరిమార్చియు భూ
భరంబుమాన్పిన రామా॥ 93

సీతాపతిరాముడవై - భూతలనాథుండవయ్యు భూభ
రులుసురా _ రాతులగు రావణాదుల - నాతతధృతిద్రుంచితౌర
యచ్యుతశౌరీ॥ 94

కృష్ణావతారశ్రీహరి - దుష్టులు శిశుపాలు కంసు దుర్యో
ధనుల - నష్టము జేసియునప్పుడు - నిష్టులునౌ పాండవులకు ని
ల యిచ్చితివా॥ 95

బుద్ధావతారమికిభవ - బద్ధులకునుగానరావు బుధజను
లెపుడు - బుద్ధిగుహాయందుగనుగొన - బద్ధుడవై మోక్షమి
డుదు బరమాత్మహరీ॥ 96

కలికావతారమానిక - కలిచేష్టలమాన్పినవుడు ఘనదు
ష్టులదా - బలమడచి కృతయుగంబున - గలధర్మము నిల్పుదని
యు గనిరిమహాత్ముల్॥ 97

బరతత్వవేదవిదివౌ - బరమాత్ముడ నిన్ను దెలియ బరమ
పదంబౌ - బరగగవాక్కునుగూడియు - బరగంగానిన్ను దెలియ
బడదయమనసుణ్॥ 98

వాక్కునుమనసును వేరై - వక్కాణింపుటకు జాలబడవవి
రెందుణ్ - జక్కగబుద్ధిచెగూడిన - మక్కువచేనిన్ను దెల్య మన
సొప్పహరీ॥ 99

ఘనముగ బ్రహ్మణ్ దెలియగ - ఘనులెవ్వరు విశ్వమందు
గనుగొనలేకణ్ - ఘనులైనవిశ్వకర్తలు - ఘనుడవుసీవేనటం
చు ఘనముగబాగడణ్॥ 100

ఆదియును లేదు మధ్యము - లేదిక నంతమును నీకు లే
దనిజెప్పణ్ - వేదములు వెదకిగన్గొన - వేదివినీవాట దెల్యవే
మయవేద్యా॥ 101

ఏకమునుసద్వితయము - సాకల్యముగానునీవు సర్వము
నందుణ్ - లోకములలోనవెల్సల - లోకాధిప నిండియుండ లో
కమునీవౌ॥ 102

విశ్వాత్మవిశ్వరూపుడ - విశ్వేశ్వర విశ్వవంద్య విశ్వము
నీవే - విశ్వాదియందునిర్మల - విశ్వమునీయందెయుండు విశ్వ
మయుండా॥ 103

భూతాత్మ భూతభావన - పూతాత్ముడ పద్మనాభ పురు
షాద్యతా - భూతమయి భూతభవ్యుడ - భూతేశుడభూతవాస
భువనాద్యతా॥ 104

కుక్షినజాండములిముకొని - వక్షమునఁ సిరియునుండ వ
టపత్రమునఁ - నిక్షేపా వసియుంతువు - దక్షుఁడ జగదాంతము
నను దామోదరుఁడా॥ 105

సర్వేశ్వరుండవనుచును - సర్వము నీవౌదువనుచు సము
డవుననుచుఁ - సర్వమయుండవుననుచును - సర్వాత్ముఁడవనుచు
నెపుడు సమమతిదలతుఁ॥ 106

నిర్గులుఁడవనుచుసత్యుఁడ - నిర్ముక్తుఁడవనుచునిన్ను నే
ర్పుగదలతుఁ - నిర్గలుననుచెనెప్పుడు - నిర్ద్వంద్వా సచ్చిదా
త్మ నిత్యుఁడవనియుఁ॥ 107

పరమబ్రహ్మపుశాశ్వత - పురుషుండవు పరమధాముపురు
షోత్తముఁడా - పరమేశవిభుఁడవిష్ణుఁడ - పరమాత్ముఁడ వాదిదేవ -
పరుఁడవనంతా॥ 108

పరమాణువునైయుంటువు - వరధామహాత్మునకు నధిక
బరమైనంతఁ - వరజగములలో నెల్లల - బురుషోత్తమ సత్య
లోకములకుఁ మీఁదై 109

అంతమును లేదునీకును - సంతతమానందమయుఁడ సర్వ
మునందుఁ - నంతర్యామివియగుటను - సంతాపము మాన్పు
నాకు సతతము రామా॥ 110

దేహాత్మబుద్ధిచేతను - నాహంకారమున నాది యదియిది
యనినే - దేహము దారసుతాదుల - దేహాదులునావటంచు దె
లిసితినపుడుఁ। 111

జీవాత్మబుద్ధిగలిగెను - జీవుడు వేరనుచు నవుడు జేసితి క
ర్మల్ - జీవేశతీర్థయాత్రలు-భావమువిగ్రహములన్ని భగవం
తులనిఁ। 112

ఇప్పుడు దెలసితినామతి - దప్పక నాభాసుడౌను దగజీవు
డనిఁ - గొప్పగుకాంతిచె చెడకను - నెప్పుడునుండేటియాత్మ
నేనాదుననిఁ॥ 113

సర్వానుస్యూతుడునై - యుర్వీమణులందు సూత్రము
న్నట్టులుగా - సర్వప్రాణులయందును - సర్వాత్ముడు నంతరాత్మ
నమముగనాకడ॥ 114

ఇద్దరవిరోధీకృతుయును - శుద్ధమునాశ్వీజమాన శుభ
లగ్నమునఁ - బుద్ధిచెనారంభముపరి - శుద్ధముగా నంతరాత్ము
శుభచరితంబుఁ॥ 115

శ్రీ రాబ్ధిశయన కేశవ - నారదసంగీతలోల నరహరిశౌరీ-
శ్రీరామవాసుదేవా - నారాయణసచ్చిదాత్మ నరసఖకృష్ణా॥

ఇతి శ్రీరామచంద్ర కరుణాకటాక్షలబ్ధ
కవిత పరికేల కొండలరాయ ప్రణీతంబయిన
శ్రీకాశీమహాత్మ్యపరమార్థచింతనయు
గల శతకము.

తత్సత్.

శ్రీసచ్చిదానంద పరబ్రహ్మార్పణమస్తు.

